ుదిసెలి, వితమరి, సంప్రసారుడు.

2487. సేవ: అడియరితనము, అడిమె, అనుగమము, అనువృత్తి, అన్వాసనము, అరాధన, ఉడిగము, ఉపచర్య, ఉపచారము, ఉపసత్తి, ఉపసదనము, ఉపస్థానము, ఉపస్థితి, ఉపాసన, ఉపాసనము, ఉపాస్తి, ఉళిగము, ఊడిగ(గె)ము, ఊడె(డియ)ము, ఊళిగము, ఓలగము, కెలసము, కైంకర్యము, కొట్నము, కొలుపు, కొలువు, చాకిరి, తొత్తుటికము, దాసము, దాస్యము, దేవన, దోస్థము, నిషేవణము, నౌకరి, పనిపాటలు, పరిచరము, పరిచర్య, పరిచారము, పరిష్టి, పర్యుపాసనము, పర్యుషణము, పర్యేషణ, ప్రైష్యము, బంటరికము, బడవవాటు, బానిసము, భిక్ష, వరవుడము, వరవుడుపని, వరవుదనము, వరివస్య, వర్వుపని, వేల, శుశ్రూష, శుశ్రూషణము, శ్లాఘ, స్వవృత్తి, సంసేవ, సపర్య, సవరణ, సిసువరకము, పెస, సేవిత.

2488. సేవించు (స.క్రి): ఆరాధించు, ఉపచరించు, ఉపాశ్రయించు, ఉపాసించు, ఓలగించు, కుస్తరించు, కొల్చు(లుచు), తెలచు, పనిగొను, పరిభజించు, భజించు, సంసేవించు.

2489. సేవకుడు: అడియ, అడియడు, అడయరి, అనుచరుడు, అనుచారకుడు, అనుజీవి, అనుయోజ్యుడు, అనుసరుడు, అభిసరుడు, ఆరాధయిత, ఆరాలికుడు, ఆలెకాడు, ఆళులు(బ.వ), ఆసన్నుడు, ఉపజీవకుడు, ఉపజీవి, ఉపసత్త, ఉపస్థాత, ఉపాసకుడు, ఊడిగీడు, ఐకాహికుడు, ఔజు, ఔపస్థానికుడు, ఔపస్థానుడు, కడవాడు, కడారుడు, కరోటుడు, కర్మకరుడు, కింకరుడు, కుర్వాణుడు, కొలువుకాడు, గర్భదాసుడు, గుండడు, గుల్లా(లా)ము, చేటకుడు, చేటుడు, జీతగాడు, డింగరీడు, డింగరుడు, తొత్తు, దత్తి, దాసమయ్య, దాసుడు, దోస్సుడు, నియోగజనుడు, నియోజ్యుడు, నైదేశికుడు, నైర్దిశికుడు, నౌకరు, పడిగాపు, పడిహారి, పనివాడు, పన్న, పరజాతుడు, పరప్రేష్యుడు, పరాచితుడు, పరికర్మి, పరికర్ముడు, పరిచరుడు, పరిచార(రి)కుడు, పరిచారి, పరిచారుడు, పరిజనము, పరిధిస్థుడు, పరిప్రేష్యుడు, పరిష్కం(స్కం)దుడు, పగ్గెధితుడు, పల్లాయనంబువాడు, పారికాపు, పారివాడు, పారుపత్తెగాడు, పాలూకుడు, పోటకుడు, ప్రాత, ప్రేంఖుడు, ప్రేష్యుడు, ప్రైష్యుడు, బంటు, బంటువాడు, బంట్రోతు, బానిస, బానిసీడు, బోడిక, భండిలుడు, భటుడు, భడిలుడు, భాజీ, భావదర్శి, భుజిష్యుడు, భూటుడు, భృతకుడు, భృతుడు, భృత్యుడు, మానిసి, మేటి, మౌలుడు, లెంక, లెంకకాడు, లెంగి, లేక, వంరుడు, వరవుడు, వైతనికుడు, వైనాశికుడు, శుశ్రూషకుడు, శ్లికువు, శ్లిక్యువు, సంశ్రితుడు, సహచారుడు, సాలకరి, సువిదుడు, సేని, సేవిత.

2490. దాసి: అనునాయిక, అయా, ఇంటిపాప, ఊడిగపుగత్తె, కుటహారిక, కొట్టి(ట్ట)కత్తె, కొలువకత్తె, చారిక, చేటి, చేటిక, చేతకత్తె, తొత్తడి, తొత్తు, పనికత్తె, పరిచారిక, పారిక, ప్రేష్య, ప్రైష్య, బడబ(వ), బానిస, భుజిష్య, వరవు, సేవావిలాసిని, సేవిక, హంజ, హంజిక.

2491. చెలికత్తె: అనుగుగత్తె(త్తియ), అలి, గెడకత్తియ, చెలిమికత్తియ, చెలియ, జోటికత్తె(త్తియ), బోటి, బోటికత్తె(త్తియ), బోటికొమ్మ, భుజిస్య, వయస్త్య, వయస్య, సంగడికత్తె, సంగడిచేడియ, సకి, సకియ, సఖి, సవయస్క.

2492. దాది: అంకపాలి(ళి), ఉపమాత, దాదిలి, దాయి, పప్పువు, మాతృక.

2493. జీతము: అవక్రయము, కూలి, కైజీతము, జీవితము, నాతము, నిర్దేశము, నిర్వేశము, నిష్క్రియము, పరిక్రయము, బరణము, భృతి, విష్టి, వేచ, వేతనము, హాస్తసిద్ధి, హోత్రము.

2494. జీతగాడు: భరటుడు, భృతకుడు, భృతుడు, బైతనికుడు, మంబళ(డ)కాడు.

2495. బత్తెము: దినగోరు, దినబత్తెము, దినభృతి, దినభృత్యము, దినరోజు, దైనిక, బత్తా.

2496. దారిబత్తెము: పాథేయము, శంబలము, సంబళ(డ)ము.

2497. ఓడకూలి: అనుతరము, కేవు, తరపణ్యము, తార్యము.

2498. పాలు: అవదోహము, ఊధస్యము, క్షీరము, గోరసము, దుగ్ధము, దోహజము, దోహనయము, దోహము, దోహ్యము, పయస్సు,

పవిత్రము, పాయి, పీథము, పుంసవనము, పృశ్ని, పేయము, పోసనము, బాలసాత్మ్యము, రసోత్తమము, శ్రేష్ఠము, సూమము, సోమజము.

2499. జున్నుపాలు: పంకము, పీయూషము, పేయూషము.

2500. ముఱ్ఱుపాలు: మోరటము.

2501. పాలుపిదుకు (స.క్రి): పాలుపిండు, పాలుపితుకు.

2502. పాలనురుగు: కార్ధరకము, శార్కరము.

2503. జున్ను: కుఱుజు, కూర్చిక.

2504. పెరుగు: తయిరు, తైరు, దధి, దధి బుసము, పిచ్ఛిలము, మంగల్యము, విజిలము, విరళము, శిఖరిణి, శ్రీఘనము, సిగర(రి).

2505. పెరుగు భేదములు: అఘనము, అర్నోఘ్నము, ప్రాగ్రాటము.

2506. మీగడ: మండము, మస్తువు, మింగడ, మీవడ, శరము.

2507. మజ్జిగ: అరిష్టము, ఉదశ్విత్తు, కాలశేయము, ఘలము, ఘోలము, చల్ల, తక్రము, దండాహతము, దధిస్వేదము, భగ్న సంధికము, మథితము, మోరటము, మోపు, రసాయనము.

2508. పులిమజ్జిగ: మెట్టు, మెడుద.

2509. మజ్జిగపులుసు: తిమ్మనము, తేవనము, నిష్ఠానము.

2510. చేమిరి: ఆతంకము, ఆతంచనము, తోడంటు, తోడు, తోడుచల్ల.

2511. పాలవిఱుగుడు: ఆమిక్ష, కూకు, క్షీరశరము, తక్రకూర్చిక, పయస్య.

2512. వెన్న: తక్రసారము, దధిజము, దధిసారము, దధిస్నేహము, నవని, నవనీతకము, నవనీతము, మంథజము, మిసిమి, వెన్నపూస, సరజము, హైయంగనము, హైయంగవీనము, హౌమ్యము.

2513. నెయ్యి: అభిఘారము, అఘారము, ఆజ్యము, ఆయుర్ద్రవ్యము, కాంతిదము, ఖజపము, ఘృతము, తనూపము, తేటి, తోయదము, పీథము, వాజము, హవిష్యము, హవిస్సు, హవ్యము, హోమ్యము,

2514. సేద్యము: కమతము, కరిసనము, కర్మ(ర్స)నము, కర్షణము, కిసుక, కృషి, కృష్టి, క్లేషము, జిరాయతి, త్రివ్వట్టు, పొలం పని, వెవసాయము, వ్యవసాయము, సాగుబడి, హలభూతి.

2515. కౌలు: ఇజ(జా)రా, ఇజారా, గుత్త.

2516. రైతు: అదువకాపు, అదేష్టి, అద్దెకాపు, అడుగు(వు)బుట్టువు, అరకాడు, కమతకాడు, కమ(మ్మ)తీడు, కర్షకుడు, కాపు, కార్ష(ర్షి)కుడు, కార్షుడు, కుటుంబి, కృష(షి)కుడు, కృషాణుడు, కృషీవలుడు, క్షేత్రకరుడు, క్షేత్రకృత్తు, క్షేత్రజీవి, క్షేత్రాజీవుడు, క్షేత్రి, గోవికర్తుడు, తలమనిషి, దుక్కిముచ్చు, పంట కాపు, పాలేరు, పొలమరి, పొలముదోకరి, ఫాలుడు, వ్యవసాయదారుడు, వ్యవసాయి, సీరవాహకుడు, సేద్యకాడు, సైరికుడు, హల జీవి, హాలికుడు, హోలికుడు.

2517. పొలము: అశ్మంతము, ఇడ(ళ), ఇర, క్షేత్రము, గుడ్డము, చేను, జమీను, నట్టు, నేల, పంపు, పన్నస, పుడమి, బలజము, మన్నెము, మాత, రాజిక, వప్రి, వారటము, వేవిలి, శాకినము.

2518. తొలిదుక్కి: ఏరువాక, మున్నరక.

2519. మూడుచాళ్లదున్నినపొలము: త్రిసీత్యము, త్రిహల్యము.

2520. వరిమడి: కయ్య, కేద(దా)రము, క్రయ్య, పాంశు(సు)మర్దనము, మడి, వప్రము, వరిపొలము, సీమ.

2521. ఊటునేల: అనూపము, ఊటనేల, చెమ్మనేల, జవుకునేల.

2522. ఎఱ్ఱనేల: జేగురుమట్టి, తొగరిమన్ను, మంజరి, మణిసిల, మనశ్శిల, మనోగుప్త, మనోహ్వ, మృతా(త్తా)లకము, సురాష్ట్రజము.

2523. చౌటినేల: ఇరిణము, ఈరిణము, ఉప్పళ(ల)ము, ఉప్పునేల, ఉప్పుబఱ్ఱి, ఊసరము, కారపుమన్ను, కారము, చగు(వు)డు, పఱ్ఱు, రుమ.

2524. రేగడి: నల్లరేగడ, రేగ(వ)డ.

2525. మాగాణి: తరి, సంజ, మాగిలి.

2526. మెట్టనేల: మిట్ట, మిఱ్ఱు, మిఱ్ఱు

ాామి, మొండు, మెరక, వెలిగడ, స్థలము, ి.

2527. బీడుభూమి: కంచెల, కొఅకు(ను), బ్బ, చెలిక, నెత్తము, పాండవబీడు, పొరం ోకు, బంజరు, బిగాడు, బీటినేల, బీడు.

2528. మన్ను: అధకి, పారి, మట్టి, మట్టియ, మను, మిత్తిక, మృత్తిక, మృత్తు, మృత్స, మృత్స్న, మృదిని.

2529. మట్టిగడ్డ: అండ, గడ్డ, పిట్ట, పెడ్డ, పెల్ల(ళ), బెత్తిక, బెత్తు, బేటు, మట్టిపెల్ల, మట్టిబెడ్డ, లోష్టము, లోష్టువు.

2530. దుమ్ము: గుండకము, తువ్వ, దుమాధూళి, దుమారము, దుమ్మరము, దువ్వ, ధూళి, పరాగము, పాంశు(సు)వు, పార్థటము, బుగ్గి, భూపరాగము, మయిల, మేదినీద్రవము, రంభము, రేణువు.

2531. పాదధూళి: పదారము.

2532. గనిమ: కురిమిడి, గట్టు, గెనెము, పరుజ.

2533. నెట్టి: పగులు, పొక్కిడి, బీట, బీటిక, వంగుడు, వదులుడి, వట్టె(ట్టియ).

2534. బొఱియ: ఒడపి, కలుగు, గండి, బిలము, బెలము, బొంద, బొక్క, బొఱక, బొట్టె, రంధ్రము, లాగ, లొటారము.

2535. మాన్యము: కట్టుబడి, శ్రోత్రియము.

2536. ఎరువు: కరీషము, గత్త, గత్తము, గొబ్బరము, పాంశువు,

2537. ఏతము: అరఘట్టము, ఉద్ఘాటనము, ఏతాము, ఘటీయంత్రము, తలము, పాదవర్తము, బుఱ్ఱతలము, సిడి.

2538. కపిలః మోట.

2539. బొక్కెన: అంబువాహిని, కూపయంత్రఘటి, చేద, బొక్కనియ, బొక్కాణము, సేకపాత్రము, సేక్త్రము, సేచనము, సేచని.

2540. దోనె: అంబువాహిని, అరిణ, దోని(నె), ద్రుణి, ద్రోణి.

2541. కొడవలి: క్షురప్రము, ఖడ్గికము, దాత్రము, లవిత్రము, లిక్కి, స్తంబఘనము, స్తంబఘ్నము.

2542. గునపము: అభ్రి, అఖనికము, అఖము, అఖరము, అఖానము, కుద్దాలము, ఖనిత్రము, ఖాత్రము, గడారు, గడ్డపాఱ, గుద్దలి, గుద్దాలము, త్రవ్వుకోల, బొరిగ.

2543. త్రవ్వు (స.క్రి): గుద్దలించు, గుద్దలిగొను, త్రవ్వు, త్రవ్వటించు, దిద్దు.

2544. పెల్లగించు (స.క్రి): అగలింతు, అగల్చు, ఉచ్చాటించు, ఉన్మూలించు, కుళ్ళగించు, కెల్లగించు. కోటరించు, కోరాడు, గ్రుచ్చు, పెకలించు, బుడ్డగించు, మట్టగించు, లోడు, సముత్పాటించు, స్పోటించు.

2545. గొట్టము: క్రోవి, నాళము, సానిక.

2546. చిమ్మనగ్రోవి: అనువాసనము, ఉత్తరవస్తి, కొమ్ము, నాళము, పింజనగ్రోలు, పింజనగ్రోవి.

2547. గొడ్డలి: కుఠాటంకము, కుఠారము, గండ్రగొడ్డలి, చిప్పగొడ్డలి, ద్రుఘణము, పరశ్వథము, పర్శు(రశు)వు, సుధితి, స్వధితి.

2548. జత్తిగె: జడి(డ్డి)గము.

2549. నాగలి: అరక, ఏరు, కలప, కుంతలము, కూటకము, కృంతము, కొండ్రకైదువు, ఖటము, గొడగ, గోకి(కీ)లము, గోదారణము, దుక్కికైదువు, దుక్కివాలు, నాగెలి, నాగేలు, పరీరము, పవీరము, మడక, లాంగలము, లాంగలి., సీకరము, సీరము, సీరాసనము, సీలము, హలము, హలి, హోలము.

2550. మేడితోక: ఈష, ఏడికోల, పిడికోల, మేడి, మేడిసోగ, హలకత్తు.

2551. నాగటికఱ్ఱు: కఱ్ఱు, కృషీ(ష)కము, నిరీషము, పరీరము, పలుగు, ఫాలము, హలముఖము, హలసీరము.

2552. నొగ: కూబరము, యుగంధరము.

2553. పాఱ: ఖనిత్రి, విశిఖ.

2554. మునికోల: కశ, తోత్రము; ప్రాజనము, ముల్లుకర్ర, ముల్లుకట్టె.

2555. కంచె: అలవ, అవరోధకము, అవహోలిక, ఆవరణము, ఆవేష్టకము, పారివెలుగు, ప్రాచీనము, ప్రావృతి, మోఘోలి, స్తవరకము.

2556. మంచె: అఱప, ఇంద్రకోశము, కురుజు, కోద్రంగము, తనుంగము, తమగము.

2557. కళ్ళము: కలకు, కలను, కొటారము, కొటారు, ఖలము, ఖల్య.

2558. కళ్లమూడ్చువాడు: ఖలపువు, బహు కరుడు.

2559. పంట: అరబము, కృషి, పైరు, ఫలము, ఫలసాయము, బలజము, మహసూలు, మాసూలు, ససి, సస్యము, సస్సెము.

2560. ఎడకారు: తొలికారుపంట.

2561. దాళ్వా(ళువా): పిక్కారు.

2562. నురిపిడి: ఒబ్బిడి.

2563. ఎన్ను: కణిశము, వెన్ను.

2564. కలమగర్భము: పొట్టకట్టు.

2565. కంకి: కండె.

2566. ధాన్యము: కొట్నము, గింజలు, గుఱు ములు, తండులీయము, బూసము, స్తంబకరి, స్తోమము.

2567. ధాన్యముకొలిచేవాడు: కయిలుదా రుడు, కైలుదారుడు.

2568. ధాన్యరాశి: అంబారము, అంబారు.

2569. పొల్లు: తప్ప, తరక, తాలు, బుసము.

2570. పొట్టు: ఉముక, ఊక, తుషము, నిష్పావము, బూగర, బూసి, శమి, సతేరము.

2571. తవుడు: కండనము, కంబుకము, కంబోకము.

2572. అనుములు: నిష్పావము.

2573. అలసంద: అలసందె, చవలము, బొబ్బర, రాజమాషము.

2574. అరికలు: అరుగ, అళ్ళు.

2575. ఉలవలు: కుళుత్థము, కొల్లులు, కొళ్ళు, మాడి.

2576. కొఱ్ఱలు: కంగువు, ప్రియంగువు, వ్రీహిరాజకము.

2577. గోధుమలు: గవేధుక, మ్లేచ్ఛాశము, సుమనము.

2578. జొన్న: చోళము.

2579. బరిగ: వరి(ర)గ, వరువు.

2580. బటానీలు: కలాయము.

2581. మినుములు: ఉద్దులు, కుల్మాషము, మాషము.

2582. మిరపకాయ: మరియపుకాయ, బృహన్మరీచము.

2583. యవలు: కుంతలము, దీప్యకము, పవిత్రధాన్యము, బార్లీ.

2584. వరి: కలమము, వడ్లు, శాలి.

2585. చిఱుసెనగలు: మసూరకము, సెనిగె.

2586. వాణిజ్యము: అయోగము, తంత్రము, పణ్యము, పెటికాటము, పొత్తు, బెహోరము, బేరము, బేరసారాలు, బేహ(హో) రము, వణిక్కు, వణిక్పథము, వణిజ్య, వర్తకము, వానియము, వ్యవహారము, వ్యాపా రము, వ్యాప్పతి.

2587. వర్తకుడు: అపణికుడు, ఉదంతుడు, కోపుదారుడు, క్రయవిక్రయికుడు, గౌర, ధటి, నిగముడు, నీవరుడు, మైనయుడు, పణి, పణీత, పణ్యాజీవుడు, పాణికుడు, పెటికసెట్టి, ప్రాప ణికుడు, బచ్చు, బేహారి, బేరి, బేహో(హ)రి, బేహారికుడు, భాండపతి, వణిక్కు, వణి జుడు, వాణిజకుడు, వాణిజుడు, వినయుడు, వినీతుడు, విపణి, వైదేహకుడు, వ్యవహారి, వ్యాపారస్థుడు, వ్యాపారి, శ్రేష్ఠి, సర్దువు, సార్థవాహుడు, సార్థకుడు, సుగంథుడు.

2588. వర్తకురాలు: జట్టికత్తె, వైదేహి.

2589. వ్యాపారులగుంపు: సాతు, సార్థము.

2590. దళారి: క్రేత, జట్టికాడు, తఱుగరి, బేరగాడు.

2591. ఓడవర్తకుడు: ఓడబేహారి, సాంయా త్రికుడు.

2592. పూసలవ్యాపారి: కాంబవికుడు.

2593. చిల్లర వ్యాపారి: పచారి.

2594. తమలపాకులమ్మువాడు: పర్ణకా రుడు.

2595. సుగంధవస్తువులమ్మువాడు: సౌగం ధికుడు.

2596. తినుబండారాలను అమ్మువాడు: షాడవికుడు.

2597. అంగడి: అపణము, అవారి, కొట్టు, గంజము, దుకాణము, నిషద్య, పచారము, పణ్యాభూమి, పణ్యాశాల, పసారము, పసారు, మండి, మలి(ళి)గ, వణిక్పథము, విపణి, సాధృతము.

2598. అంగడివీధి: అవడంకము, క్రయా రోహము, గంజు, నిగమము, పణగ్రంధి, పణ్యవీధి, పాణి, పేట, బజారు, బాజాఱు,

ణిహము, విపణివీధి, సంవాహము, స్రవ
ంగము, హొట్టము, హొట్టి.

599. సంత: కచంకనము, గుజ(జి)రీ,
ట్టము.

600. వేలము: ఏల(లా)ము.

601. సరకు: జట్టి, సామాగ్రి.

602. ఎగుమతి: ముట్టు.

603. పట్టిక: జాబితా, డాబు, పట్టి(ట్టీ),
ాచి, సూచిక.

604. వెల: అగ్గువ, అర్ఘము, అవక్రమము,
మము, ఖరీదు, జట్టి, దర, దారణ,
ర, నిమానము, నిష్క్రియము, బోగము,
ూల్యము, రొక్కము, వస్నము, విలువ.

2605. అధికధర: గాయకము, గిరాకి,
రము, ప్రియము.

2606. తక్కువధర: అగ్గువ, చౌక.

2607. అమూల్యము: అనర్ఘము.

2608. బేరము: జట్టి, సాటా, సాటాకోటి,
సాటాబేరము.

2609. అమ్మకము: తెగుబడి, విక్రయము,
విపణము, శూలము.

2610. అమ్ము (స.క్రి): అమ్ముడుపెట్టు,
జట్టియిచ్చు, జట్టియిడు, పోకడపెట్టు, పోకా
రుచు, విక్రయించు, పిలుచు, వెలకుపెట్టు.

2611. అమ్మువాడు: విక్రయి, విక్రయికుడు,
విక్రేత.

2612. కొనుగోలు: క్రయము.

2613. కొను (స.క్రి): క్రయించు, విలుచు.

2614. కొనువాడు: కొనుగోలుదారుడు.

2615. సంచకరము: అచ్చారము, ధరావత్తు,
పగిడీ, బయానా, సంచకరువు, సంచకర్వు,
సంచకారము, సత్యంకారము, సత్యాకృతి,
సత్యాపనము.

2616. వినిమయము: అదానప్రదానము,
ఇచ్చి పుచ్చుకోలు, నియమము, నిమేయము,
నిష్క్రయణము, నిష్క్రియము, నైమేయము,
పరావర్తము, పరిక్రయము, పరిదానము, పరివ
ర్తనము, పరీవర్తము, ప్రతిదానము, భాండప్రతి
భాండకము, మార్పు, మాఱకము, మాఱు
గడ, మాఱుదల, మాఱుపు, విడిగోలు,
సాట(టా).

2617. అప్పు: అచ్చుదల, అప్పుసప్పులు,
అరువు, ఋణము, ఎరవు, చేబదులు, చేయప్పు,
తరావి, ధారము, నిల్వ(లువ), పరచి, సర్యు
దంచనము, పొరచి, ప్రామార్త్యము, బకాయి,
బాకీ, యాచితకము, రవడి, రో, రోయి,
వారకము, వెచ్చము, సత్యము.

2618. అప్పుతీసికొన్న వ్యక్తి: అధమర్ణుడు,
అప్పులపోతు, ఋణగ్రస్తుడు, ఋణవంతుడు,
ఋణస్థుడు, ఋణి, ఋణికుడు, బాకీదారుడు.

2619. కుదువ: అగావు, అడ్డము, అధమ
నము, అధి, అయకము, అహకము, ఆహి,
ఇల్లడ, ఈడు, ఉద్దర, ఉద్దరువు, గిరవు,
గీవు, తనఖా, తాకట్టు, నిక్షేపము, న్యాసము,
పడిదియ, ప్రతిధేయము, ప్రతిశీర్షకము, రో,
రోయి, వారకము, వినిమయము.

2620. కుదువపెట్టు (స.క్రి): అడిపెట్టు,
ఇల్లడపెట్టు, తనఖాపెట్టు, తాకట్టుపెట్టు,
న్యసించు, న్యాసముచేయు.

2621. వడ్డీ: తేమానము, నాగు(వు), వృద్ధి.

2622. అధికవడ్డీ: మిండవడ్డీ.

2623. వడ్డీధాన్యము: నాగు.

2624. మొదలుసొమ్ము వడ్డీ: కల.

2625. ఒడబాటువడ్డీ: కారిత.

2626. దినవడ్డీ: సాంకాలిక.

2627. చక్రవడ్డీ: చక్రవృద్ధి.

2628. వాయిదా: కంతు, గడువు.

2629. వడ్డీవ్యాపారి: ఉత్తమర్ణుడు, ఋణ
దాత, ఋణదాయి, కుసీది, కుసీదికుడు,
కుసీదుడు, వార్ధుషికుడు, వృద్ధ్యాజీవుడు, షావు
కారు, సావుకారు, సాహు.

2630. వ్యయము: ఉపక్షయము, ఖర్చు(
రుచు), నిస్రావము, పట్టుబడి, వెచ్చము,
వెయము, వ్రయము.

2631. తిండిఖర్చు: బోనవెచ్చము.

2632. వ్యయమగు (స.క్రి): ఖర్చగు,
వెచ్చపడు, వెచ్చపోవు.

2633. వెచ్చించు (స.క్రి): ఖర్చుచేయు,
ఖర్చుపెట్టు, చిందు, చిందువందుచేయు, పోకడ
పెట్టు, పోకారుచు, వెచ్చపఱుచు, వెచ్చపెట్టు,

వెచ్చముసేయు, వ్యయపఱచు, వ్యయించు, వ్రయించు.

2634. లాభము: అదా, అప్తి, అసత్తి, కూడుదల, గిట్టుబడి, గిట్టుబాటు, నయము, ప్రతిర(ల)ంభము, ప్రాప్తి, ఫలము, ఫలోద యము, మేలు, లబ్ధి, వాసి, విధానము, సంపత్తు, సంప్రతిపత్తి, సాతి, సాధనము, సామర్థ్యము, సిద్ధి, హితము.

2635. ఆదాయము: అగమము, అమతి, అయము, కనుబడి, జమ(మా), ఫలితము, రాబడి, వచ్చుబడి, వరుమానము, శదము.

2636. నష్టము: చెఱుపు, తరుగు, దండుగ, దండుగ(వు), దికాలా, పరిభ్రంశ నము, పుట్టిమునక, బొక్క, వట్టము, సేగి, హానము.

2637. కొలత: కొలమానము, కొలు వడి, విమానము, పరిమాణము, పాయ్యము, మానము, పమ్మానము, సీమ, స్వపాటము.

2638. కొలుచు (స.క్రి): కొలపెట్టు, కొల్చు.

2639. సగటు: అంచనా, అందాజు, అందాసు, ఇంచుమించు, ఉర(రా)మరిక, ఉజ్జాయింపు, దాదాపు, బరావర్తు, రమ(మా) రమి, సుమారు.

2640. ఖచ్చితము: కచ్చితము, గుత్తము, సున్నితము.

2641. త్రాసు: ఏషణి, కాటా, కుదుక, తక్కె(క్కి)డ, తరాజు(సు), తునికోల, తుల, తూనికకోల, తొలము, దడ, ద్రువయము, ధటకము, ధటము, పౌతవము, మాయ్యము.

2642. త్రాసుత్రాడు: రాగసూత్రము.

2643. తూచు (స.క్రి): ఎత్తువేయు, తూనివేయు, తూన్చు, దడకట్టు.

2644. బరువు: తూకము, ధుర, పర్యాహా రము, పూటము, పొది, పొదుక, బారకము, భరము, భారము, మొదుకన, మోత, మోపిక, మోపు, వేకన, వేగు, వ్రేకడనము, వ్రేకన, వ్రేకము, వ్రేగు.

2645. బరువు మోయువాడు: నిమిత కాడు, మోతకాడు, మోపరి, మోపరిగాడు, మోపరీడు, మ్రోపుకాడు.

2646. తేలిక: ఉలక, ఉల్క, ము, లఘ(గు)వు, లాఘవము.

2647. ధనము: అర్థము, ఆదాయము, ఋక్థము, ఒడమి(మె), కాసు, క్షత్త్రము, గయము, చక్రము, డబ్బు, దుడ్డు, ద్యుమ్నము, ద్రవిణము, ద్రవ్యము, నగదు, నిధి, నెలగ, పచ్చ, పణము, పవిత్రము, పరిబర్హము, పింగు, పురులు, పైకము, పైడి, ప్రాతిభా వ్యము, బండారము, బండారు, భోగము, భోగ్యము, మాత్ర, ముడుపు, ముల్లె, మొల్లమి, మొల్లము, యోగము, రాధస్సు, రిక్థము, రూక, రొక్కము, రో, లపక, లిబ్బి, లెక్క, వసువు, వస్తువు, వాజజము, వామము, విడిముడి, , విత్తము, విధానము, విభవము, సత్త్రము, సాతి, సాధనము, సొత్తు, సొమ్ము, స్వము, స్వాపతేయము.

2648. మూలధనము: అసలు, పరిప ణము, పెట్టుబడి, బండవలము, బండాలము, మొదలు, సంచిమొదలు.

2649. చిల్లరడబ్బు: చిలువానము, చిలువా యనము.

2650. నిధి: గుప్తి, నిక్షేపము, నిధానము, పాతఱ, లంకెబిందెలు, లిబ్బి.

2651. సంపద: అప్తి, అస్తి, ఇస్తువు, ఈశ, ఈశనము, ఉపార్జనము, ఏద, ఐశ్వర్యము, కలిమి, నంద, నీటు, పదవి, పోడిమి, ప్రాయి, బగి(వి)సి, బయిసి, బైసి, భగము, భాగధే యము, భాగ్యము, భూతి, భూమము, మిసిమి, లచ్చి, విభవము, శ్రవణము, శ్రవస్సు, శ్రీ, సంపత్తి, సంపత్తు, సంపన్నము, సామర్థ్యము, సారము, సిరి, సువిదిత్రము, సొత్తు, సొమ్ము, సోమ, సౌభగము, స్తోమము, స్వాస్థ్యము, స్వోవశీయము, హిరణ్యము.

2652. ధనవంతుడు: అచ్చుకుప్ప, అఢ్యుఢు, అస్తికాడు, అస్తిపరుడు, ఇభ్యకుడు, ఉభ్యుడు, ఉపపన్నుడు, ఐశ్వర్యవంతుడు, కలవాడు, గర్భే శ్వరుడు, గుజాటీ, ధణియ, ధనాఢ్యుడు, ధని, ధనికుడు, భాగ్యవంతుడు, రయి, లక్ష్మీవం తుడు, విత్తవంతుడు, శ్రీకరుడు, శ్రీమం తుడు, శ్రీలుడు, సంపత్కరుడు, సంపన్నుడు, సిరిమంతుడు.

2653. నాణెము: టంకము, టంకవాటు, నాడెము.

2654. వివిధ నాణెములు: అణా, ఏగాని, దుగ్గాని, ముడేకము, ఎడబెట్టు, ఎరుస, కాని,

సు, నవరసు, గుడ్డికాసు, చిల్లిగవ్వ, చౌలము, ›రము, దమ్మిడి, రువ్వ, దుగులము, నేబు, క్క, బిరుదుగద్య, బేడ, పావులా, చిన్నము, వుక, రూక, మాడ, దినారి, దీనారము, ష్కము, పణము, పిచువు, బిస్తము, సువ ము, సొన్న(న్నా), సొన్నము, మినుకు, ›ాబరి, రూపాయి, రూప్యము, రౌప్యము, రహా, గద్దె(ద్దియ), గద్యాణము, వరా, స్కాని, సురకాని(ణి), హైమముద్ర.

655. సంపాదన: అర్జనము, అపాదనము, ›ర్జనము, గడన, పడపు, రజన, సంప్రాప్తి.

656. సంపాదకుడు: అయతికాడు, అర్జ ›డు, ఆపార్త.

657. సంపాదించు (స.క్రి): ఆర్జించు, ›పార్జించు, గడించు, ఘటించు, జోకచేయు, ›ందు, పడయు, సంగ్రహించు, సంతరించు, ›ంప్రాపించు, సముపార్జించు, సాధించు.

2658. దారిద్ర్యము: అకించనిత, అకించ నియ, అకించనిమము, అనిర్వృతి, అభూతి, ఆకించన్యము, ఎద్దడి, ఖుల్లము, ఖేదనము, దరి ద్రము, దరిద్రాణము, దారిద్రము, దైన్యము, నైస్వ్యము, పేదర్కి, పేదఱికము, పేదఱిమి, బీదతనము, బీదఱికము, రిక్తత, లేమి, లేమిడి, లేవడి, సీ(ద(దర)ము.

2659. దరిద్రదేవత: అలక్ష్మి, ఐంద్రి, కాలకంఠిక, కాలకర్ణి, జ్యేష్ఠ, జ్యేష్ఠాదేవి, దారిద్ర్యదేవత, దౌర్భాగ్యము, పెద్దమ(మ్మ).

2660. పేదవాడు: అకించనుడు, ఇత్వరుడు, కంతేరుడు, కాకరూకుడు, కీనాశుడు, కూటి పేద, క్రకరము, ఖిదిరుడు, ఖిద్రుడు, గరీబు, గాలిగ్రుడ్డు, గుల్లకాడు, చేబోడి, దరిద్రాయ కుడు, దరిద్రితుడు, దరిద్రుడు, దిగంబరుడు, దీనుడు, దుర్గతుడు, దుర్విధుడు, ధనహీనుడు, నిధనుడు, నిరుపేద, నిర్ధనుడు, నిర్భాగ్యుడు, నిష్కించనుడు, నిస్స్వుడు, పేద, ప్రాయిడి, ఫకీరు, బడరుడు, బరికట్టె, బికారి, బిక్క, బీద, బీదవాడు, బుక్కాఫకీరు, ముష్టింపచుడు, రంకుడు, లేనివాడు, లొల్లకాడు, వరాకుడు.

2661. అంగమర్దనము: ఆలోడనము, మాలీషు, సంవాహనము.

2662. పిసుకు (స.క్రి): ఎత్తు, నలుపు, నలుము(చు), నుల్చు, పుడుకు, మర్దిచు, మెదుచు, మేది(డి)ంచు, మొదుచు, ప్రచ్చు.

2663. అంగమర్దుడు: అంగమర్దకుడు, సంవాహకుడు.

2664. కసాయివాడు: అజమారుడు, కటి కవాడు, కౌటికుడు, ఖడ్గికుడు, గోవికర్తుడు, మాంసికుడు, వైతంసికుడు, శమిత, సీవకుడు, సూనగాడు, సూని, సౌనికుడు, సౌనుడు.

2665. చర్మకారుడు: అసాది, కురటుడు, గూబరి, గొడగరవాడు, గొడగరి, గొడారి, గోడారి, గోద, గోదారి, గోసంగి, చర్మ రువు, చర్మారుడు, చర్మావకర్త, చర్మావకర్తి, జీనిగిరివాడు, పాదూకృత్తు, మాతంగుడు, మాదిగవాడు, మాదిగి, ముచ్చెవాడు, మృత పుడు, సంబరి(ళి).

2666. ఆరె: అర, కొంగవాలు, గల్ల, చర్మప్రభేదిక, చర్మభేదిక.

2667. తలారి: అరక్షకుడు, ఆరెకుడు, తల వరి, దండవాహి, పారి, పారికాపు, పురరక్షుడు, యామికుడు.

2668. తాపీపనివాడు: గారికాడు, బేల్దారి(రు).

2669. తోటమాలి: ఆరామికుడు, తోట కాపు, తోటగొల్లడు, తోటీడు, తోటమాలి, తోటవాడు, మాలకరి, మాలి.

2670. దర్జీ: కుట్రపువాడు, చిప్పెవాడు, తున్నవాయుడు, సేవకుడు, సూచికుడు. సూత్ర భిత్తు, సౌచి, సౌచికుడు.

2671. కత్తెర: కర్తని, కర్తరి, కర్త్రి, కల్పని, కేశకారము, ఖండదార, పత్రపాలి.

2672. అడకత్తెర: సయోని.

2673. సూది: సీవని, సూచకము, సూచి(చీ), సూచిక, సూచిని, సేవతి.

2674. దూదేకులవాడు: దూదేకు, పింజారి.

2675. ఏకు: తూలనాళి, తూలనాళిక, దూదిచుట్ట, పింజిక, దూదేకు విల్లు: పింజ, పింజనము.

2676. రాట్నము: ఏకుల రాట్నము, చరఖా, రాటనము.

2677. దొంగతనము: అపహరణము, అప హరింత, అభిగ్రహము, అహోరము, ఒలి, కొల్ల, గిలుబు, ఘాతము, చుర, చూఱ, చోరత్వము, చోరిక, చోరీ, చౌరిక, చౌరీ, చౌర్యము,

తెరువాటు, తెక్కలి, దావరము, దొంగపని, దొంగతికము, దొద్ద, దోగురు, దోపిడి, దోపు, నాచికోలు, నిర్లుంఠనము, పచ్చె(చ్చియ)ము, పరిమోషము, పటి, పూర్ణానకము, ప్రతిరోధము, మూషణము, మోష. మోషణము, మోషము, మోస, మోసము, ప్రముచ్చిమి, ప్రముచ్చిలి, ప్రముచ్చిలితనము, ప్రముచ్చుతనము, లూటీ, స్తైన్యము, స్తేయము, హరణము.

2678. దొంగిలించు (స.క్రి): అంకించు, అంటుకొనిపోవు, అటమటించు, అడగోలు గొను, అపహరించు, అహరించు, ఎత్తు, ఒడుచు, ఒలుచు, కాజేయు, కొల్లగొట్టు, కొల్లగొను, కొల్లపఱచు, కొల్లపుచ్చు, కొల్ల పెట్టు, కొల్లలాడు, కొల్లాడు, గిలుబాడు, గిలుబుకొను, గిలుబుచేయు, గెబ్బు, చుబ్బ నచూఱలాడు, చూఱగొను, చూఱపుచ్చు, చూఱపెట్టు, చూఱలాడు, చూఱాడు, తక్కలిగొను, తస్కరించు, తెక్కలిగొను, దొంగిలు, దొద్దగొను, దొద్దలాడు, దొద్దలుపుచ్చు, దోచు, దోచుకొను, నాచు, పటిగొను, పిక్కు, పుచ్చుకొను, పొడుచు, ప్రయోషించు, ప్రముచ్చిలించు, ప్రముచ్చిలికొను, ప్రముచ్చిలు, లంకించు, లాగుకొను, వెరజు, సంగ్రహించు, సడపు, హరించు.

2679. దొంగ: అధశ్చరుడు, అపహారకుడు, అవహారుడు, అఖువు, అమోషి, ఎత్తు(ద్దు) బరికాడు, ఎల్లాపి, ఐకాగారికుడు, కలముడు, కుంభి(భీ)లుడు, కుంభీర(ల)కుడు, కుంభీరుడు, కులంభరు(లు)డు, కుసుమాలుడు, ఖర్పరుడు, గరిడిముచ్చు, చేవాడికాడు, చోరుడు, చౌరుడు, జాజరకాడు, దొంగ, తక్కిడికాడు, తడికద్రోపరి, తస్కరుడు, తెక్కలి, తెక్కలికాడు, దస్యుడు, దివాభీతుడు, నక్తంచరుడు, నాగరకుడు, నాచు, పచ్చెకాడు, పటచ్చరుడు, పటచ్చోరుడు, పశ్యతోహరుడు, పాటచ్చరుడు, పొలపరి, బరి, మలిమ్లుచుడు, మాచలుడు, ముడియవిడుపు, మోషకుడు, ప్రముచ్చు, రాత్రి చరుడు, రేరిపోణుడు, లటుడు, లుంఠాకుడు, వటరుడు, శంకితవర్ణుడు, సైలగుడు, స్తేనుడు, స్తేయి, స్తైనుడు, స్రోతస్యుడు, హారికుడు, హర్త, హారకుడు, హారి, హైరికుడు, హోడ.

2680. జేబుదొంగ: కత్తెరదొంగ.

2681. ఎల్లాపికత్తె: చోరురాలు.

2682. కన్నపుదొంగ: అఖనికుడు, కన్నగాడు, కుజంభ(భి)లుడు, ఖనకుడు, ఖానిలుడు, గండిదొంగ, బొక్కలాడు, భిత్తిచోరుడు, సంధి చోరుడు, సంధిహారకుడు, సురంగయుక్కు.

2683. దోపిడిదొంగ: కొల్లకాడు, కొల్లరి, చిల్లాభుడు, చూఱకారుడు, తెరువాటుకాడు, తెరువాటీడు, దొద్దకాడు, దోపరి, దోపిడికాడు, దోపుకాడు, దోపుడుకాడు, పరాస్కంధి, పరిపంథి, పరిపంథుడు, పారిపంథికుడు, ప్రతిరోది, బంది, బందికాడు, బందిపోటు, నటరుడు.

2684. చోరసాధన విశేషాలు: గాలిచీర, చిలుకుతాడు, నల్లదట్టినబిల్ల, నారసము, నీలిచీర, నీలిదట్టీ, పరోముఖము, ములుదోరణము.

2685. పాములవాడు: అహితుండికుడు, ఆహితుండీకుడు, కుడుమివాడు, గారడి, గారడీడు, గారుడికుడు, నాగమండలికుడు, పాములమెంగడు, బరిజోగి, వ్యాలగ్రాహి, వ్యాళగ్రాహుడు, సర్పధారకుడు, సర్పవిత్తు.

2686. బిచ్చగాడు:, అడుక్కొనేవాడు, అర్థి, కార్పటుడు, గొరగ, చరకుడు, జోగి, జోలెకాడు, తిరిప, తిరిప(పె)గాడు, తిరిపగొట్టు, తిరిపజోగి, తిరిపడు, తిరిపతిండి, తిరిపరి, తిల్లి, తిల్లిగొట్టు, ధ్వాంక్షుడు, నైకటికుడు, పకీరు, పారిరక్షకుడు, పిండాశుడు, బికారు, బికాసి, భిక్షగాడు, భిక్షకుడు, భిక్షువు, బిస్నాటి, మార్గణుడు, ముష్టివాడు, యయావరుడు, యాచకుడు, యాచనకుడు, యాచిత, యాచిష్ణువు, యాయావరుడు, వనీపకుడు, వనీయకుడు, వసుకీటము, స్థవిరుడు.

2687. బిచ్చకత్తె: తిరిపెగత్తె, భిక్షురాలు, వంద.

2688. భిక్షుకసమూహము: భైక్షవము, భైక్షుకము.

2689. భిక్షాపాత్ర: అన్నపూర్ణచెంబు, కప్పెర, ఖర్పరము, తిరిపిగూడ, నట్టెము, పటువ, ముష్టిచెంబు.

2690. భిక్షాన్నము: అగ్రము, పులికూడు, భైక్షము, భైక్ష్యము, మధుకరము.

2691. బిచ్చము: గులాము, జొగ్గు,

జోగు, తిరిపె(ప)ము, పులిక, బికి(క్కి)రము, భిక్షణము, భిక్షము, ముష్టి.

2692. భిక్షావృత్తి: అభిశస్తము, అభిశస్తి, అర్థన, అయవారము, తిరిపము, భైక్షజీవిక, మధుకరవృత్తి, మధుకరము, యయావరము, యాచ్న(చన), యాయావరము.

2693. ఉంఛవృత్తి: పఱిగబ్రతుకు, లేకిబ్రతుకు.

2694. బిచ్చమెత్తు (స.క్రి): అడుగు, అడుగుకొను, తిరిపమెత్తు, తిరియు, భిక్షమెత్తు, భిక్షించు, మండాడు, యాచించు.

2695. మాలాకారుడు: పుష్పలావుడు, పుష్పాజీవుడు, మాకరి, మాలకరి, మాలికుడు, సూనరి, స్రజ్వ.

2696. పుష్పలావిక: పువ్వులపువ్వుబోడి, స్రక్కరి.

2697. రాగిపనివాడు: తామ్రకరుడు, తామ్రకుట్టకుడు, తామ్రకుట్టుడు, సౌల్బికుడు, శౌల్వికుడు.

2698. రాతిపనివాడు: అశ్మకుట్టకుడు, కాసీడు, కాసె, కాసెవాడు, కుటుడు, వడ్డెర.

2699. శంఖపుపనివాడు: శాంఖికుడు, సంకులాడు.

2700. సానపెట్టువాడు: అసిధావకుడు, చికిలివాడు, శాణీకుడు.

2701. మంత్రము: మంతు, మనువు.

2702. విషమంత్రము: గార(రు)డము.

2703. మంత్రించు (స.క్రి): మంతిరించు, మంత్రమువేయు.

2704. మాంత్రికుడు: తాంత్రికుడు, మంత్రకాడు, మంత్రవాది, మంత్రవేది, సంప్రయోగి.

2705. మాంత్రికురాలు: సాంబరి.

2706. దయ్యాలపంపు చేయువాడు: అభిచారికుడు, తోడుబోతు, దయ్యాలబోతు.

2707. ఇంద్రజాలము: కనుకట్టు, కనుమాయ, గారడము, గారడి, నెఱవిద్దె, ప్రతిహారము, ప్రాతిహార్యము, మాయ, శంబరి, శాంబరి, సంప్రయోగము, సంశ్చిత్తు, సాంబరి, హస్తలాఘువము.

2708. ఇంద్రజాలికుడు: ఐంద్రజాలికుడు, గారడివాడు, గారడివాడు, గారడీడు, చక్రచరుడు, ప్రతిహారుడు, మాయాకారుడు, మాయాజీవి, మాయావి, మాయి.

## 21. రాజ్యము - దేశం, రాజు, రాజ్యం....

2709. దేశము: అధిరాజ్యము, ఆణె(ణియ)ము, ఉపవర్తనము, ఏలుబడి(వు), నట్టు, నాడిక, నాడు, నిర్గము, నీవృతము, నీవృత్తు, నేల, పట్టము, పాళెము, పుడమి, ప్రదేశము, భూమి, భోగము, మండలము, మండెము, మహత్తు, మాడెము, రాజ్యము, రాష్ట్రము, వర్షము, విలాతి, విలాయతి, విషయము, సామ్రాజ్యము.

2710. రాజధాని: కటకము, రాచవీడు.

2711. ఎల్ల: అంతకము, అంతము, అందల, అణి, అరి, అవధి, అఘాటము, అణీ, ఆయత్తి, ఉగ్గుడు, ఉపకంఠము, ఏప(పి)రి, ఓర, గడి, గడువు, గరిగంటి, గరుసు, గురుసు, చక్రవాటము, తీరు, తేకువ, దరిదాపు, ధారణ, నరి, పరిచ్ఛేదము, పరిమితి, పాళము, పొలము, పొలిమేర, బయిసి, బరి, మందల, మరియాద, మర్యాద, మితి, మీరము, మేర, వఱ, వేల, సమయము, సరిహద్దు, సరుదు, సాదు, సీమ, సేతవు, స్థలసీమ, హద్దు.

2712. రాజు: అధిపతి, అధిప్రజుడు, అధిభువు, అధిరాజు, అధిరాట్టు, అధీశుడు, అధీశ్వరుడు, అనుజీవ్యుడు, అరసు, అర్థపతి, అవనీజాని, అవనీపతి, అవిఘుడు, అష్టకర్ముడు, అష్టగతికుడు, ఇభ్యకుడు, ఇభ్యుడు, ఇరావంతుడు, ఈశానుడు, ఈశిత, ఈశుడు, ఉర్వీభృత్తు, ఉర్వీశుడు, ఎకిమీడు, ఏలిక, ఏలినవాడు(రు), ఏలినాతడు, ఒడయుడు, కుతలపతి, కుభృత్తు, కువలయేశుడు, క్షత్రియుడు, క్షితిజాని, క్షితిపతి, క్ష్మాపాత్రుడు, క్ష్మాభృత్తు, ఖాను, ఖానుడు, గుటిలుడు, గుటికాడు, గోత్రాకాంతుడు, గోపాలుడు, చక్రవంతుడు, చక్రవర్తి, చారచక్షువు, ఛత్రపతి, జియ్య, దండధరుడు, దండుడు, ధణి, దమకర్త, దునీడు, ద్రుంభువు, ద్రుసానుడు, దేవర, దొర, ధరణీజాని, ధరణీధవుడు, ధరణీధరుడు, ధరణీపతి, ధరణీపాలుడు, ధరాభుక్కు, ధరాభృక్కు, ధరాభృత్తు, ధవుడు, నందంతుడు, నందయంతుడు, నగరివారు,

నమతుడు, నరపాలుడు, నరాధిపుడు, నరేం
ద్రుడు, నాథి, నాయడు, నిజాము, నీడు, నృదేవుడు, నృపతి, నృపాలుడు, నృపుడు, నేత, నేలగాపరి, నేలతాలుపు, నేలయేలు దంట, నేలరేడు, పజదొర, పట్టపయ్య, పట్టభద్రుడు, పద్మలాంఛనుడు, పబువు, పరి పాలకుడు, పాదుసా, పాదుసాహి, పార్థివుడు, పార్థుడు, పాలకుడు, పాలికుడు, పాళెగాడు, పుడమికాపరి, పుడమితాలుపు, పుడమిదొర, పుడమిపుడు, పుడమిమగడు, పుడమితేడు, పుడమీశుడు, పృథ్వీ(థివీ)పతి, పృథ్వీభుజుడు, పృథ్వీభృత్తు, పృథ్వీశుడు, ప్రజాపతి, ప్రభువు, ప్రశాస్త, బొజుగు, భరండుడు, భరణ్యువు, భరువు, భానువు, భురిక్కు, భువనేనశ్వ రుడు, భువన్యుడు, భూజాని, భూధనుడు, భూధరుడు, భూనాథుడు, భూపతి, భూపా లుడు, భూపుడు, భూభుక్కు, భూభుజుడు, భూభృత్తు, భూమిజాని, భూమిభృతుడు, భూవ రుడు, భూవల్లభుడు, మగడు, మనుజేంద్రుడు, మన్నియ, మన్నియడు, మన్నీడు, మన్నుతేడు, మన్నె, మన్నెకాడు, మన్నెడు, మన్నెదొర, మహీ క్షితుడు, మహీజాని, మహీంద్రుడు, మహీపతి, మహీభృతుడు, మహీమహేంద్రుడు, మహీశ్వ రుడు, మానవదేవుడు, మానిసితేడు, మూర్ధా భిషిక్తుడు, మూలేరుడు, మేదినీపతి, రాగుడు, రాచవారు, రాట్టు, రాయడు, రారాజు, రావు, తేడు, లోకపాలుడు, వల్లభుడు, వసుధాధిపుడు, వాణి, విట్పతి, విభుడు(వు), విషయి, శలం గుడు, శాస్త, శ్రీపతి, శ్రేష్ఠుడు, సంపద్వరుడు, సంయద్వరుడు, సంయమనుడు, సమ్రాట్టు, సర్వేశుడు, సామి, సామ్రాట్టు, సార్వభౌ ముడు, సుల్తాను, సువిదుడు, సూరుడు, సేవ్యుడు, స్కందుడు, స్కంధుడు, స్వామి.

2713. **రాజకుమారుడు:** భర్తృదారకుడు, రాజన్యుడు, రాజపుత్రుడు, రాజకుమారుడు, రాయకుమార.

2714. **రాజగృహము:** దేవిడీ, నగ(వ)రు, మహలు, రాచలోగిలి, పటారము, పటారు.

2715. **రాణి:** అధిపురాలు, అరియ, ఏలిక సాని, చక్రవర్తిని, దేవె(వే)రి, దొరసాని, పోట, రాజపత్ని, రాజ్ఞి, రాణివాసము, శుద్ధాంత, శుద్ధాంతము, సాని, సామ్రాజ్ఞి, స్వామిని.

2716. **పట్టపురాణి:** అగ్రమహిషి, దేవి, పట్టపుదేవి, పట్టమహిషి, మహిషి.

2717. **అంతఃపురము:** అంతర్నగరము, అంతర్వంశము, అంతర్వేశము, అంతర్వే శ్మము, అంతిపురము, అంతిపురి, అట్టకము, అట్టాలకము, అట్టాలిక, అవరోధనము, అవ రోధము, అవరోధాయనము, కోణె, దేవిడి, నగ(వ)రు, నగళ్ళు, పరావిద్ధము, రాణివా సము, వటారు, శుద్ధాంతము, సువిదల్లము, సౌదాసము, స్త్రీగృహము, హవేలి.

2718. **అంతఃపురస్త్రీ:** అవరోధనము, అవరోధము, అవరోధిక, అసూర్యంపశ్య, రాణివాసము, రాణివాసి, శుద్ధాంతము.

2719. **కోట:** కిల్లా, ఖిల్లా, గడి(డీ), దుర్గము, ద్వంద్వము, పురా.

2720. **కోటగోడ:** అలంగము, అలగము, అలవరి, ఆడు(ఖు)వరి, పీఠభువి, వప్రము.

2721. **బురుజు:** కపిశీర్షము, కురుజు, కోటకొమ్మ, క్రొక్కడ(ఠ)ము.

2722. **ప్రాకారము:** కంధావాటము, చుట్టు గోడ, పారి, పారిగోడ, ప్రగ్రీవము, ప్రహరి, బవరి, వరణము, సాలము.

2723. **అగడ్త:** అగడ(డి)త, కందకము, ఖాతకము, ఖాతభువు, ఖాతిక, కేయము, గడము, దవంత్రి, పరికె, పరిఖ, పరిఖాతము, పోల, ప్రతికూపము.

2724. **సొరంగము:** కన్నము, క్షితివ్య దాసము, తల్లము, బిలము, భూమార్గము, వానము, వివరము, సందు, సురంగము.

2725. **కావలి:** అద్దికము, ఉక్కళము, కంగా నము, కోవురము, పహరా, పాళె(లె)ము, పారా, బలకరము, రక్షణ, సజ్జనము.

2726. **కావలివాడు:** అవరోధకుడు, అర క్షకుడు, అరక్షుడు, ఆరెకుడు, ఉపరక్షుడు, కాపరి, కెవనిబంటు, కోలుకాడు, తలవరి, తలారి, యామికుడు, వైబోధికుడు, సైన్యుడు, స్థానాధ్యక్షుడు.

2727. **పొలముకాపు:** పొలమరి.

2728. **సింహాసనము:** కంఠీరవాసనము, గద్దె(ద్దియ), చదురు, తక్తు(ఖ్తు), భద్రాసనము, సింగపుపీట, సింహపీఠము, సింహవిష్టరము.

2729. **కిరీటము:** కోటీరము, కోహళి,

తిరి(రీ)టము, బందురము, బొమిడిక, బొమ్మి కము, బొమ్మిడీకము, మకుటము, ముకు టము, ముడి, మౌళి(ళి), శీర్షకము, శేఖరము, సీసకము, హేరము.

2730. ప్రభుత్వము: అడదడి, అమలు, దొరతనము, ప్రాభవత్యము, ప్రాభవము, విభు త్వము, శృంగము, సర్కారు.

2731. పరిపాలనము: అధికారము, ఏలుబడి, దానము, పరిరక్షణము, పాలన, పాలనము, ప్రశాసనము, ప్రాశాస్త్రము, శాసనము, శిష్టి.

2732. పరిపాలించు: (స.క్రి) అధ్యక్షించు, ఏలు, పాలించు.

2733. అధికారము: అఖ్త్యాయిషీ, అధికర ణము, అధికర్మము, అధిక్రియ, అనుభావము, ఆధిపత్యము, ఆళుతనము, కారుబారు, చనవు, చనుమానము, చెల్లుబడి, జబర్దస్తీ, నాయంక రము, పట్టము, పదకము, పదవి, పదురు, పలు కుబడి, పారుపత్తెము, పిట్టపిడుగు, పెత్తనము పెద్దరికము, ప్రాజాపత్యము, మణియ(వ)ము, మన్నెతికము, రపము, స్వామ్యము, హౌరవు.

2734. గుడి పారుపత్తెము: శ్రీకార్యము.

2735. అధికారి: అధికర్ముడు, అధికృతుడు, అధినాథుడు, అధినేత, అధిపతి, అధిపుడు, అధిష్ఠాత, అధ్యక్షుడు, ఈటట్టు, ఉదాస్థితుడు, ఉద్ధారుడు, దొర, పారుపత్తె కాడు, పాలకుడు, మణివ(య)కాడు, సంప్రణేత, సామంతుడు, స్థాయికుడు.

2736. మణియగాడు: నాయంకుడు.

2737. దళవాయి: ప్రణాయకుడు.

2738. గ్రామాధికారి: గ్రామణి, గ్రామ పాలుడు, గ్రామాధిపతి, గ్రామి, గ్రామికుడు, దౌస్సాధికుడు, పటేలు, పింగాళుడు, మణేగారు, మునసబు, రట్టడి, రెడ్డి.

2739. రాష్ట్రాధికారి: మండలాధిపతి, మండలికుడు.

2740. ధర్మాధికారి: అధికరణ, భోజకుడు.

2741. కొట్టు అధికారి: ఉగ్రాణగాడు.

2742. టంకశాలాధికారి: నైష్కికుడు.

2743. ముద్ర: అచ్చు, చప్ప, సీలు.

2744. శాసనము: చట్టము, రాకట్టు.

2745. శాసకుడు: విధాయకుడు, విధాయి, శాసన, హారి, శాసనహారుడు, సాస్త, సంయ మనుడు.

2746. ఆజ్ఞ: అదలిక, అనుజ్ఞ, అనుజ్ఞానము, అనుమతి, అనుశాసనము, అనుశిష్టి, అభ్య నుజ్ఞ, అజ్ఞప్తి, ఆజ్ఞాపనము, ఆదేశము, అన, అనతి, ఉత్తరువు, ఒప్పము, ఓజ, కట్టడి, జంపు, తాస్సీలు, దురా, దురాయి, నియుక్తి, నియోగము నియోదనము, నిర్దేశము, పంపు, పన్ను(నుపు), పరామానా, పలుకు, ప్రసవము, ఫర్మానా, మాట, ముదల, వర్ది, విధానకము, విధాయకము, విధృతి, శాసనము, శాస్తి, శాస్త్రము, శిష్టి, సందేశము, సంప్రైషణము, సమయము, సమాదేశము, సవము, సెలవు, సెల్వు, స్థాని, హద్దు, హవము, హుకుం.

2747. ఆజ్ఞాపకుడు: నిదేష్ట, శాసకుడు.

2748. ఆజ్ఞాపించు (స.క్రి): అంపు(చు), అనుచు, అనుపు, ఆజ్ఞపెట్టు, అనతిచ్చు, అనపెట్టు, కట్టడచేయు, కేలువిడుచు, నిదే శించు, నియమించు, నియోగించు, పంచు, పంపిడు, పంపు, పంపువెట్టు, పడిచేయు, పనిగొను, పనిపం(వం)చు, పనుచు, ఫర్మా యించు, మందలించు, ముదలపె(వె)ట్టు, ముదలించు, శాసించు, సెలవిచ్చు.

2749. అనుమతి: అప్పన, రజా, సెలవు.

2750. అస్థానము: అజారము, ఆస్థ, అస్తాని, ఒడ్డోలగము, ఓలగము, కొలువు, కొలువుకూటము, చదురు, తారణి, దర్బారు, పర్యుపస్థానము, పేరోలగము, రచ్చ, సంస్థా నము, హజారము, హుజూరు.

2751. కొలువుసేయు (అ.క్రి): ఓలగించు, రచ్చయొనర్చు, రచ్చసేయు, సభదీర్చు.

2752. కొలువుండు (స.క్రి): ఓలగమగు, ఓలగముండు, రచ్చయుండు.

2753. అస్థానమండపము: అజారము, ఇంద్రకము, కచే(చ్చే)రి, దర్బారు, దివాణము, నగరు, రచ్చకొట్టు, రచ్చపట్టు, రచ్చపట్టు కొట్టము, రాజాలయము, సంసద్భవనము, సభాగృహము, సభామండపము, హజారము.

2754. సభ: కూటము, పరిషత్తు, సంసత్తు, సంస్థ, సదము, సదస్సు, సమజ్య, సమావేశము.

2755. సభికుడు: పరిషదుడు, పరిషద్బలుడు,

పార్ష(రిష)దుడు, పార్షద్యుడు, ప్రాశ్ని(శిని) కుడు, సదస్యుడు, సభాసదుడు, సభాస్థారుడు, సమాజికుడు, సామాజికుడు.

2756. పరివారము: అనుయాత్రము, అభిజనము, తత్తబడ, తోయము, నియోగము, నెరవు, పటలము, పరిగ్రహము, పరిజనము, పరిబర్హణము, పరిబర్హము, పరిస్పందము, పరీవారము, పేటము, బల్గ(లగ)ము, మంది, మాత్ర, రాణువ, సంగడము, సామగ్ర్యము, సిబ్బంది, సేవకులు.

2757. మంత్రి: అమాత్యుడు, గ్రంథిహారుడు, దివాను, పెగడ, ప్రగ్గడ, ప్రెగ(గ్గ)డ, ప్రెవడ, మంతిరి, మంతు, వ్యాపృతుడు, శమథుడు, సచివుడు, సామవాయికుడు.

2758. కోశాధికారి: కోశాధ్యక్షుడు, ధనపాలుడు, పంచజనీనుడు, బచ్చు, బండ(డా)రి, బండరు, బండరుడు.

2759. కోశాగారము: ఖజానా, ధనగృహము, ధనదాని, బండ(డా)రు, బండరువు, బండారపుటిల్లు, బండారము, బండారిల్లు, బొక్కసపిల్లు, బొక్కసపుటిల్లు, బొక్కసము, భండారము, ములుగు, విడిముడిపట్టు.

2760. రాయబారము: ఎడ, దూతకృత్యము, దూత్యము, దౌత్యము.

2761. రాయబారి: అర్కార్రా, ఆహ్వాయకుడు, ఆహ్వాయి, కాలరి, భండి(ది)లుడు, రతువు, రభువు, రాజ్యభారి, వాచికహారకుడు, వార్తాయనుడు, వార్తావహుడు, వర్తాహరుడు, లార్తికుడు, శాసనహరుడు, శాసనహారి, సందిష్టుడు, సందేశహరుడు, సందేశహారకుడు, స్థానాపతి, హర్కార్రా.

2762. గూఢచారి: అపసర్పుడు, అయాథార్థవర్ణుడు, ఉదాస్థితుడు, కొట్టికాడు, కోటి, కోటికాడు, గుప్తగతి, గుప్తచరుడు, గూఢచారుడు, గూఢపురుషుడు, గృహపతి, చరకుడు, చరుడు, చారకు(ణు)డు, తీరుపరి, దాడికాడు, పడవాళ్లు, పురందరుడు, ప్రణిధి, ప్రతిశ్కసుడు, బాతిని, యథార్థవర్ణుడు, యోగుడు, వేగరి, వేగు, వేగులవాడు, వేగువాడు, సంస్థుడు, సూచకుడు, స్పశుడు, హితప్రణి, హీర(రి)కుడు.

2763. రహస్యము: అంకిలి, అణి, అయము, ఉపగూఢము, ఉపాంశువు, ఏకతము, ఏకాంతము, ఒళపు, ఓల(లి)మి, ఓలము, కిటుకు, కీలకము, కీలు, గాయకము, గుంజిలి, గుంబము, గుట్టు, గుత్తము, గుప్తము, గూఢము, గూహనము, గోపనము, చాటు, తాపి, దాపటికము, దాపుడు, నిగూఢము, నిగూహనము, నిహ్నుతు, నెఱకు, నెఱను, నెళవు, నేటు, ఫుండు, మంతనము, మంత్రము, మర్మము, మఱి, మఱుగుపాటు, మారాము, సన్నిభృతము, సునిభృతము.

2764. మర్మజ్ఞుడు: అణికాడు, ఒళవరి, నెళవరి.

2765. ద్వారపాలకుడు: ఉత్సారకుడు, ఉదాస్తితుడు, కక్షావేక్షకుడు, కెవనిబంటు, గర్వాటుడు, గవనికాపరి, గవనిబంటు, దండవాది, దండహస్తుడు, దండి, దణాయుడు, దర్శకుడు, దర్శయిత, దౌవారికుడు, దౌస్సాధికుడు, ద్వారాదర్శి, ద్వారస్థుడు, ద్వారి, ద్వారికుడు, ద్వాస్థితుడు, ద్వాస్థుడు, నిర్గమనుడు, పడి(డి)హారి, పడిహారుడు, ప్రతి(తీ)హారి, ప్రతి(తీ)హారుడు, ప్రాతిహార(రి)కుడు, వర్తరూకుడు.

2766. కంచుకి: అంగజాల, అంతఃపురికుడు, అంతర్వేశికుడు, అంతర్వేశ్మికుడు, అన్నగరు, అన్నగారు, అవరోధికుడు, అయుడు, తూబరుడు, వర్షవ(ధ)రుడు, శుద్ధాంతచారి, సావాసి, సావిదల్లుడు, సావిదుడు, స్థాపత్యుడు, హెగ్గడి, హెగ్గడికాడు, హెగ్గడీడు, హేడుడు.

2767. హెగ్గడికత్తె: కటికది, గమికత్తె, పక్కెరాలు, సైరంధ్రి.

2768. వైతాళికుడు: ఉద్బోధకుడు, ఖేటితానుడు, ఘాంటికుడు, చాక్రికుడు, ప్రబోధకుడు, బోధకరుడు, సౌఖశాయనికుడు.

2769. వేత్రధరుడు: కటికవాడు, కట్టిక, కోలకాడు, చోపుదారుడు, దణాయుడు, నకీబు, బెత్తులవాడు, బ్రద్దలవాడు, వేత్రహస్తుడు.

2770. పన్ను: అనుపు, అప్కారి, అప్పనము, అబ్కారి, అరి అబుకారి, అయము, ఇల్లరి, ఉంకువ, ఉపప్రదానము, ఒప్పనము, కప్పనము, కప్పము, కరము, కూలి, తహశ్శీలు, కాస్సీలు, తీర్వ(రువ), దాణము, పంగము, పగడి(ది), పలచము, పుల్లరి, బడి, బలి, బేడిగ, భాగదేయము, విరాడము, శిస్తు, శుల్కము, షడ్భాగము, సిద్దాయము, సుంకము.

2771. కరణికము: గణకవృత్తి.

2772. కరణము: కరణికుడు, కాయస్థుడు, గణకుడు, పిండిలుడు, లెక్కకాడు.

2773. సుంకరి: అధికర్మికుడు, అను పరి, శుల్కాధికారి, శౌల్కికుడు, సుంకరీడు, సుంకీడు.

2774. ఉద్యోగి: అధికారి, కార్యి, నాయం కుడు, నిమితకాడు.

2775. ప్రతినిధి: ఉత్తి, ప్రతి, ప్రతిహస్తకుడు.

2776. నివేదికుడు: ఆవవేదకుడు, ఆవేది, విజ్ఞాపకుడు.

2777. విదేశీయుడు: అన్యదేశస్థుడు, పర దేశస్థుడు, పరదేసి, పారదేశికుడు, విదేశి, వైదేశికుడు.

## 22. యుద్ధం, సేన, దండయాత్ర, చతురంగ బలాలు, వివిధ ఆయుధాలు

2778. యుద్ధము: అంకము, అంబరీషము, అని, అనీకము, అభిక్రమము, అభిక్రాంతి, అభిగ్రహము, అభిమరము, అభిమర్దము, అభి సంపాతము, అభ్యాగమము, అభ్యామర్దము, ఆక్రందము, ఆజి, ఆనర్తము, అయోధనము, ఆలము, ఆవహము, ఆస్కందనం. ఉత్థా నము, ఉదరము, ఎసలు, కంగారు, కంగిస, కంఠాలము, కదనము, కయ్యము, కర్కం ధువు, కలకు, కలను, కలహము, కలి, కవిదల, కొట్లాట, ఖజ, గ్రుద్దు లాట, చివ్వ, చివ్వి, జగడము, జన్యము, జిద్దు, ఝుకటము, తంపి, తగవు, తమలము, తొడత్రొక్కుడు, త్రోపు, దంతకూరము, దండడి, దురము, దొమ్మి, నదనువు, పడవ, పవరము, పెనకువ, పోటు, పోరాటము, పోరితము, పోరు, పౌంస్యము, పౌలస్త్యము, పోషము, ప్రఘాతము, ప్రతిదార ణము, ప్రధనము, ప్రవిదారణము, ప్రహరణము, ప్రాఘాతము, బలజము, బవరము, భండ నము, భీమరము, మృధము, మేడెము, మొగ్గరము, మొన, యోధనము, రణము, వరాకము, విగ్రహము, విదారణము, విదా రము, వైరారోహము, శంబరము, సంకరము, సంఖ్యము, సంగము, సంగరము, సంగ్రామము, సంపరాయము, సంపరాయికము, సంప్రహా రము, సంయత్తు, సంయుగము, సంయో ధము, సంవిత్తు, సంస్ఫేటము, సంస్ఫోటము, సంస్ఫోటి, సన్నిపాతము, సమరము, సమాఘా తము, సమాహ్వాయము, సమితము, సమితి, సమిత్తు, సమీకము, సముద(దా)యము, సమ్మ ర్దము, సాంపరాయము, సాంపరాయికము, స్కంథము, స్పశము, హోరము.

2779. యుద్ధముచేయు (స.క్రి): పెనగు, పోట్లా(టులా)డు, పోరాడు, పోరితమాడు, పోరు, మేడముపొడుచు.

2780. ఎదిరించు (స.క్రి): అడరు, అభిగ మించు, అభియోగించు, అలుము, ఎదురాడు, ఎదురు, ఎదురుచు, ఎదురొడ్డు, ఎదుర్కొను, ఎదుర్చు, ఎద్రుచు, ఎనయు, ఒడ్డారించు, ఒడ్డుకొను, కచ్చించు, కదురుకొను, కరిసించు, కలబడు, కలియబడు, కలవబడు, కవియు, చండించు, చెనకు(యు), రవణించు, ఢీకొను, తలపడు, తాకు, తాకుదెంచు, తార్కొ (రుకు)ను, తిరుగబడు, తిరుగు, తొడరు, దాడియాడు, దొరలునడుముదాపు, నిష్టం కించు, పన్ను, పరిఘాణించు, పురణిపెనగు, పైప(బ)డు, పొదువు, పోరు, ప్రతిఘటించు, బాదరించు, భంగించు, మందటలాడు, మారు మలయు, మారొడ్డు, మార్కొను, మార్పెట్టు, మార్మలయు, మాఱుడు, మాఱుపెట్టు, మాఱువెట్టు, మాఱొడ్డాడు, మిండొడ్డు, ముట్టు, ముదలకించు, ముదలించు, మురికొను, మొండొగ్గు, మెండొడ్డు, మొనకట్టు, మోహ రించు, రాయు, వక్కరి(ళి)ంచు, వక్రించు, విగ్రహించు, సొడాసొడల్ వోవు.

2781. గధాయుద్ధము: సాదనపెనకువ.

2782. దొమ్మికయ్యము: క్రందుకయ్యము, దొమ్మిజగడము, సంకుల సమరము, సందడి.

2783. ద్వంద్వ యుద్ధము: ఎక్కటి కయ్యము, ఎక్కటిపోరు, ఎక్కటిబవరము, ఏకాంగిపోరు.

2784. బాహుయుద్ధము: దోర్యుద్ధము, నియుద్ధము, పిడిగు(గ్రు)ద్దులాట, మల్లయు ద్ధము, ముష్టియుద్ధము, మౌష్ట.

2785. రాత్రియుద్ధము: ప్రయాతము, ముత్తిలి(మి)పోటు, సౌప్తికము.

2786. యుద్ధభూమి: ఆయోధనము, జన్యాంగనము, నిపత్య, పంచకము, పాలిక లను, యుద్ధరంగము, రణరంగము, రుండిక, వీరాశంసనము, సమరోద్దేశము.

2787. సైన్యము: అక్షౌ(క్షో)హిణి, అనీకము, అనీకిని, ఉత్థనము, ఎట్టపోరు, కందాచారము, కటకము, కూటువమూక, చక్రము, చదలము, చమువు, చేరువ, తంత్రము, తత్తబడ, తిట్ట, దండము, దండు, దణా, దళము, దుముదారు, ధట్ట, ధ్వజము, ధ్వజిని, నాసీరము, నుతిక(కె), పటాలము, పతాకిని , పరి, పరివారము, పాళెము, పవుజు, పృతనము, పొట్లము, పోతము, పౌజు, బలగము, బలము, మూక, మొన, మోహరము, రాణువ, వరూధిని, వాహిని, వీడు, వెల్లువ, వేలము, వ్యూఢము, సాహిణము, సేన, స్కంధావారము.

## 23. వస్తువు దాని వివిధ స్థితులు, పరిమాణం

2788. సేనాముఖము: అగ్రానీకము, ఎలగోలుసేన, తలతంత్రము, నాసీరము, పడవలయు, మునుము, మొన, సేనాగ్రము.

2789. సేనానాయకుడు: గమికాడు, చమూపతి, చమూపసేఖరుడు, చేరువకాడు, తంత్రపాలుడు, దండనాథుడు, దండనాయకుడు, దండపాలకుడు, దండపాలుడు దండముఖుడు, దణాపెద్ద, దణాయడు, దణి, దళవరి, దళవాయి, దుముదారుదొర, దొర, నాయంకుడు, నాయకవాడి(ళి), పడవాలు, పడాలు, పాలియగాడు, పాళెగాడు, బలాధ్యక్షుడు, మొనకాడు, వరూధినీధవుడు, వాహినీపతి, సంప్రణీత, సాంగ్రామికుడు, సేనముదలియారి, సేనాగోపుడు, సేనాగ్రజుడు, సేనాధిపతి, సేనాపతి, సేనావాహుడు, సైన్యరక్షకుడు, సైన్యాధ్యక్షుడు.

2790. పతాకము: కదళి, కేతనము, కేతువు, కొడి, చిహ్నము, జండా, జెండా, టెక్కు, టెక్కెము, ధ్వజము, నిశానీ, పడగ, పతాక, బావుటా, లలామము, శూల, సిడము.

2791. చిఱుగంటలు కట్టిన ధ్వజము: ఘంటా ఫలకము.

2792. శిబిరము: అవస్కంధము, అసిమిగొల్లెన, ఔపకార్య, కుటరువు, కేణిక, గుడారము, గుడారు, గుడి, గుణాలయము, గుల్మి, గుడారము, గుడారు, గొల్లెన, చదలము, చప్పరము, చత్రము, డేరా, దూష్యము, దేరీజు, నవగోజు, నివేశనము, పటకము, పటకుటి, పటవాసము, పాంశుచామరము, పోతాచ్ఛాదనము, ప్రోత్సాధనము, బిడారము, బిడారు, వటారము, వటారు, విడిదల, విడిప(మ)ట్టు, వీడు, వేలము, శ్రేణిక, స్థూలము.

2793. యోధుడు, అంగరక్షకుడు: అతిరథుడు, అనీకస్థుడు, అమరగాడు, అస్త్రజీవుడు, ఆయుధజీవి, ఆయుధజీవుడు, ఆయుధికుడు, ఆయుధీయుడు, చమూచరుడు, చిత్రయోధి, జవాను, జోదు, దాడికాడు, నిమితకాడు, పోటుబంటు, బంటు, బలి, భటుడు, భటిలుడు, మానిసి, యుదానుడు, యుధుడు, యుధ్ముడు, యోధ, యోద్ధ, శస్త్రధరుడు, శస్త్రాజీవి, సంశప్తకుడు, సమరథుడు, సాంయుగీనుడు, సేనాచరుడు, సైనికుడు, సైన్యుడు, సోలుదారు, సౌరథుడు, స్కందకుడు.

2794. ఏక్కటివీరుడు: ఎక్కటీడు, ఏకవీరుడు, ఏకాంగి, ఒంటరీడు.

2795. దండయాత్ర: అభిక్రమము, దండుదాడి, దౌడు, ధాటి, యానము, యుద్ధయాత్ర, సారి, సుయాణము.

2796. దండెత్తు (స.క్రి): ఎత్తు, దండయాత్రచేయు, దండుగదలు, దండునడచు, దండుపోవు, దండువిడియు, దండువెడలు, దాడిచేయు, దాడిపోవు, దాడివెట్టు, దాడివోవు, పరిగొను, పరివెడలు, పైనడుచు.

2797. ముట్టడి: అభ్యవదనము, అభ్యవస్కందము, అభ్యాసాధనము, కోల్త(లుత)ల, తాకుదల, ప్రతిరోధము, ముట్టడ(ణ)ము, ముట్టుకోలు, లగ్గ, సంరోధము, సంశ(స)రణము.

2798. ముట్టడించు (స.క్రి): ఫిరాయించు, చుట్టు, చుట్టుకొను, చుట్టుముట్టు, ముట్టికొను, ముట్టుకొను, ముట్టుకోలుగొను, ముట్టుకోలుపట్టు, ముట్టుకోలుపఱుచు

2799. వ్యూహము: ఒడ్డనము, బలవిన్యాసము, మొగ(గ్గ)రము, మొన, మోహరము, రచన.

2600. అచలవ్యూహము: పర్వతాకారవ్యూహము.

2801. క్రౌంచవ్యూహము: కొంచెమొగ్గరము.

2802. దండవ్యూహము: వరుసమొగ్గరము.

2803. పద్మవ్యూహము: తమ్మిమొగ్గరము.

2804. శకటవ్యూహము: బండిమొగ్గరము.

2805. రథము: అరదము, కంచరము, కూబరము, కూబరి, గాడీ, చంకురము, చక్రవారి, చక్రపాదము, తార్క్ష్యము, తేరు, ద్వివేశర, ధ్వజి, నిషంగధి, శతాంగము, స్యందనము.

2806. రథచక్రము: బండికల్లు.

2807. రథికుడు: తేరుకాడు, పత్త్రి, ప్రవేత, రథి, రథిరుడు, వరూథి, శతాంగుడు.

2808. సారథ్యము: సాత్యము.

2809. సారథి: చాతురికుడు, చోదకుడు, తేరుపూన్పరి, దక్షిణస్థుడు, నియామకుడు, నిషంగది, ప్రాజకుడు, ప్రాజిత, యంజానుడు, రథచోదకుడు, వోఢ, సంగ్రహీత, సవ్యేష్ఠుడు, సాది, సూతుడు, స్థపతి, హయంకషుడు.

2810. మావటివాడు: అంకుశగ్రహుడు, అంకుశి, అంబష్ఠుడు, అనీకస్థుడు, అధోరణుడు, ఆరోహకుడు, ఆరోహుడు, ఇభ్యకుడు, ఇభ్యుడు, గజాజీవుడు, నాగవారికుడు, నిషాది, బరికాడు, మావంతుడు, మావటి(టీ), మావటీడు, మావతుడు, మేందుడు, మేరుడు, యంత, వరారోహుడు, హస్తిపకుడు, హస్తివాహుడు, హస్త్యాజీవుడు, హస్త్యారోహుడు, హోస్తికుడు.

2811. అంకుశము: అంకుసము, అరెగోల, తోత్రము, బరిగోల, వంకియ, వేణుకము, శృణి, సిడి, సిళ్లు, సృణి.

2812. రౌతు: అబిసీ, అశ్వవారుడు, అశ్వవాహుడు, అశ్వసాది, అశ్వసాదుడు, అశ్వారోహుడు, ఆరోహకుడు, ఆశ్వికుడు, ఎక్కుడుగాడు, తౌరంగికవీరుడు, పల్లాయనంబువాడు, రవుతు, రావుతు, రావుతుడు, రాహుతు(త్తు)డు.

2813. కాల్బలము: కాలిమూక, కాలుబలము, నృసేనము, పదాతిదళము, మంది.

2814. కాలిబంటు: కాలరి, కాలిమానిసి, కాల్వరు (ని.బ.), నడజోదు, పదగుడు, పదాతి(జి), పదాతికుడు, పదాతుడు, పద్గుడు, పద్రథుడు, పాతికుడు, పాదాతికుడు, పాదాతుడు, పాదాత్తు, పాయకుడు, పాయికుడు, సిపాయి.

2815. కవచము: అంగరకా, అంగరక్ష, అంగరక్షణి, అక్త్రిము, అముక్తము, ఒడలిమరువు, కంకటకము, కంకటము, కంచుకము, కత్తళ(ల)ము, కవసము, చట్ట, చిలుకత్తు, చిలుకొత్తు, చోలుకము, జగర(ల)ము, జాగరము, జాలిక, జిరా జీరా, జోడు, తనుత్రము, తనుత్రాణము, తొడుగు(వు), తొడ్గు, త్రాణము, దంశనము, దంశము, దశనము, నిచోళకము, నివాతము, పేరణము, పేరిణి, బక్తరు, బాణవారము, బొందడ(ళ)ము, బొందడీ, మఱుపు, మేమఱుగు, మైమఱువు, యోగము, వరూథము, వర్మము, వారణము, వారవాణము, సజ్జ, సన్నాహము.

2816. అంగుళిత్రాణము: అత్రైము, గోధ, హస్తకవచము, హస్తవారణము.

2817. ఉదరత్రాణము: నాగోదము, నాగోదరి.

2818. గజకవచము: సరిజోడు.

2819. బాహుత్రాణము: బాహులము.

2820. భుజకవచము: అంసత్రము.

2821. ముఖత్రాణము: దలపము, మొగవడము.

2822. శిరస్త్రాణము: నెట్టము, నెట్టె(ట్టియ)ము, బొమిడిక, బొమి(మ్మి)డికము, బొమ్మకము, బొమ్మిడీకము, శిరస్కము, శిరస్త్రము, శీర్షకము, శీర్షణ్యము.

2823. కవచధారి: కత్తలీడు, పరివరుడు, హొందడీడు, వరూధి, వర్మి, వర్మితుడు, సజ్జుడు, సన్నద్ధుడు.

2824. ఆయుధము: అతిఘము, అస్త్రము, ఋష్టి, కైదువు, జఘ్ని, దళపము, పోటుముట్టు, ప్రహరణము, శస్త్రము, శిలి, శూలము, సస్యకము, హత్నువు, హనువు, హము, హేతి.

2825. ఆయుధాగారము: ఆయుధశాల.

2826. పొడుచు (స.క్రి): ఊటు, కుమ్ము, క్రుమ్ము, గుచ్చు, గ్రుచ్చు, తాటించు, దూటు,

పోటుగొను, బసుకు, మెఱుము, విఘట్టించు.

2827. విల్లు: అస్త్రము, ఇశ్వా(ష్వా)సము, కపోదా, కమాను, కార్ముకము, కాలపృష్ఠము, కోదండము, గుణి, చాపము, తృణత, త్రిణత, దండారము, దరమము, దోని, ధనస్సు, ధనువు, ధన్వము, ధర్మము, పంచారము, బద్ద, బాణాశ్రయము, భాణాసనము, లస్కి, విలు, శారారోపము, శరాసనము, సారంగము, సింగాణి, సింగిణి.

2828. వింటికొప్పు: అటని, ఆర్త్రి, కోటి, కోపు, గనయము, చూలి.

2829. వింటిపిడి: ధనుర్మధ్యము, పిడికట్టు, లస్తకము.

2830. అల్లెత్రాడు: అరి, అల్లె(లియ)ము, గుణము, గొనము, గొనయము, జ్యా, తెగ, ద్రుణ, నారి, పతంచిక, మోపు, మౌర్వి, వింటినారి, శింజిని, సింజిని, స్నాయుబంధము, స్థావరము.

2831. వింటినారిధ్వని: టంకారము, టంకృతి.

2832. విలువిద్య: ధనుర్విద్య, ప్రచాలకము.

2833. బాణము: అంగూషము, అంపకట్టె, అంపకోల, అంపర(ఱ), అంబకము, అంబు, అగ్నిశిఖము, అజిహ్మగము, అమ్ము, అయోముఖము, అవాయి, అసుసువు, అస్త్రము, ఆరాముఖము, ఆశుగము, ఇషువు, ఋజుగము, కంకపత్రము, కంటకము, కటంబము, కట్టె(ట్టియ), కలంబము, కాండము, కాదంబకము, కాదంబము, కింశారువు, కోల, ఖగమము, ఖగము, ఖరాలికము, ఖురాలకము, ఖేలి, గఱిచిలుకు, గసిక, గార్ధ్రము, గొరక, చిలుకు, చీకర, జిరా, తూపు, తొడుగు, దిగ్ధము, నారసము, నారాచము, నాళీకము, పక్షి పత్రము, పత్రి, పరిఘము, పీలువు, పుష్కరము, పృషత్కము, ప్రక్ష్వేడనము, ప్రదర(ల)ము, ఫలము, బరిగోల, మార్గణము, మిట్ట, మిట్టకోల, ముల్కి(లికి), రోపము, లకోరి(రీ), వత్సదంతము, వాజి, విజినము, విజ్జన(ల)ము, విశిఖము, విహంగము, వీరతరము, శరము, శలాక, శల్యము, శిఖండి, శిఖి, శిలీముఖము, శృంగజము, సరము, సరుడు, సాయకమ్ము, సాయము, సింగాణి, సితము, సుపర్వము, సూకము, సూచీముఖము, సృకము, సూపము, సెల, సెలకట్టె(ట్టియ), స్థూలక్ష్వేడము, స్వరువు.

2834. బాణపుములుకి: చిల్ల, ఫలము, ఫలి, బొట్టె, ముల్కి, సెల.

2835. బాణప్రవాహము: అంపకాలువ, అంపపోకడ, అంపఱ(ర), అంపవాన, అంపవెల్లి(లి), అంపవెల్లువ, అంపసెల, అంపసోన, అంపెసక, బాణపరంపర.

2836. అంపశయ్య: అంపపాన్పు, శరతల్పము.

2837. బాణభేదాలు: అడ్డవాతియమ్ము, ఆరె, అరకట్టె, కుప్పెకోల, కూలమ్ము, క్షురకము, గన్నెరాకమ్ము, చిప్పయమ్ము, చేయమ్ము, జోడమ్ము, దోటమ్ము, దోనమ్ము, పాలమ్ము, పాలవాతి, తూపు, వెడదవాతియమ్ము.

2838. అర్ధచంద్రబాణము: అఱ్ఱకొన్నెల తూపు, కత్తివాతితూపు, కత్తివాతియమ్ము, క్షురప్రము, గొలపము, నెలవంకకోల.

2839. ఆగ్నేయాస్త్రము: అగ్గితూపు, అగ్గిములుకి, ఇంగలము, ములికి, కొర్వికోల, కొలవికోల, చిచ్చఱమ్ము, తెమ్మెరచెలిచిల్కు.

2840. నాగాస్త్రము: పాపతూపు, పాపరమ్ము.

2841. బ్రహ్మాస్త్రము: నలువతూపు, బమ్మయమ్ము.

2842. వాయవ్యాస్త్రము: ఈదతూపు, గాడ్పుతూపు.

2843. అమ్ములపొది: అంపదొన, అంపపొది, అంబులపొది, ఇఘుది, ఉపాసంఘము, కలాపము, ఖోలి, తరకసము, తరకసాతూణము, తూణము, తూణీరము, దొన, నిషంగము, పొణివడము, బత్తడి(లి)క, బాణాధి, బాణాశ్రయము, శరధి, శరనిధి.

2844. విలుకాడు: అంపకాడు, అస్త్రి, ఇష్వాశుడు, వీటులాడు, కాండీరుడు, కోదండి, క్షిపకుడు, ధనుర్ధరుడు, ధనుష్మంతుడు, ధన్వి, ధానుర్దండికుడు, ధానుష్కుడు, ధార్మికుడు, నిషంగధి, నిషంగి, వింటిజోదు, వింటివాడు, విల్కాడు, విలుదాల్పు(లుపు), శరవాణి, శార్ఙ్గి.

2845. విలుకానిపాద విన్యాసములు: అలీ

ఢము, ప్రత్యాలీఢము, మండలము, విశాఖము, సమపదము.

2846. గుదియ: ఉద్ఘాతము, గద, గుదుప, ద్రుఘణము, ద్రూఘణము, పరిఘము, పరిఘాత(ప)నము, పరిఘాతము, బడిత, బరిస, భిండి(ంది)పాలము, భిండివాలము, ముద్గరము, లవుడి(ణి), లౌడి(ణి), స్పగము.

2847. డాలు: అజ్జిలము, అడ్డసము, అరిగ, ఒడ్డనము, కేడె(డియ)ము, కేవడము, ఖడ్గారీటము, భేటకము, భేటము, చర్మము, డాలువారు, దడిగ, దాలు, పల(లు)క, పరోవంటము, ఫరము, ఫలకము, ఫలము, బ్రద్ధపరిస్ఫరకము, స్ఫరము, స్ఫురము, హారిగ.

2848. కత్తి: అక్షరము, అడిదము, అడ్డాయుధము, అలుగు, అసి, అసితాంగము, ఇష్టి, కగ్గము, కటా(తా)రము, కటారి(రీ), కటారు, కరండము, కరపాలి, కరపాలిక, కరపా(వా)లము, కరవాలిక, కరవాలు, కరవీరకము, కరవీరము, కరాచురకత్తి, కరాళికము, కృపాణము, కృపాణి, కృపాణిక, కౌక్షేయకము, ఖడ్గము, చంద్రహాసము, చాకు, జంబాడి, జీరము, తమాలము, తరవ(వా)రి, తలిమము, తీక్ష్ణధారము, దోదుమ్మిదారి, ధర్మపాలము, ధారాంగము, ధారాధారము, ధేనుక, నరాజి, నారాజి, నిస్త్రింశము, పట్టె(ట్టియ)ము, పాలిక, బాగుదార, మండలాగ్రము, మేల్కత్తి, రిష్టము, రిష్టి, వరండ, వరాసి, వాలము, వాలు, వేలము, శ్రీగర్భము, సంతానిక, సస్యకము, సాయకము, స్త్రీకోశము, స్వాతి.

2849. అడ్డకత్తి: పట్టిసము, మొహదా, చిన్నకత్తి. ఈలి, ఈలిక, కరపాలి, కరపాలిక, కరాసి, చిక(క్క)టారి, చేగత్తి, ములుగత్తి.

2850. చురకత్తి: అసిధేనువు, అసిపుత్రి, కఫాణిక, కృపాణిక, ఖడ్గధేనువు, ఖడ్గపుత్రిక, చురి, చూరకత్తి, చూరి, ఛురి, ఛూరిక, ఛూరి, తలువకత్తె, తేగాకత్తి, శస్త్రి, సురె(రియ), సురెకత్తె.

2851. పట్టాకత్తి: తలవరి(లి), పాటకము, విధుపంజరము.

2852. మచ్చుకత్తి: బుట్టకత్తి, మడ్డుకత్తి, మోటకత్తి, విచ్చుకత్తి.

2853. కత్తిపిడి: అయుగము, గాజుపరుజు, త్సరువు, పరుజు, ఫరంజు, సరువు.

2854. పొన్ను: అనుసు, తొడి, శంబము.

2855. కత్తియొఱ: అరడా, ఒఱ, ఖడ్గకోశము, గనీబు, ద్రుహణము, ప్రత్యాకారము.

2856. వాదర: అశ్రి, ఖడ్గపత్రము, ధార, పాలిక, మొన, వాయి.

2857. కైదువుచేయువాడు: కుఠారువు, శస్త్రకారుడు.

2858. ఖడ్గధారి: అసికుడు , కటారికాడు, కౌక్షేయకుడు, ఖడ్గాయుధుడు, ఖడ్గి, ఖడ్గికుడు, నైస్త్రింశికుడు.

2859. బాకు: కఠారము, కఠారి, చిల్లాణ(డ)ము, చుర, చరియ, జము(ముృ) దాడి, పిడె(డియ) ము, ముప్పిడి, మొలకత్తి, వంకి, వంకిణి.

2860. చిల్లకోల: తోమరము, నేజ(జా), నేజము, సక్తి, సర్వల.

2861. చేపలను పొడుచు చిల్లకోల: తండుగోల, మండ(డా)ము.

2862. ఈటె: అత్తల(శము), ఇట్టి, ఈటియ, కుంతము, కొంతము, గడ, గడువు, చిల్లకోల, జాల, డొంకెన, నేజా, ప్రాసము, బరిచి(చీ), బల్లకోల, బల్లె(లియ)ము, భల్లము, శూలము, సబళము, సబి(బ)డి, సవడి(లి).

2863. ఈటెకాడు: ఇట్టికాడు, జాలవాడు, ప్రాసికుడు, సవడికాడు.

2864. తుపాకి: క్రోవి, గుంటిక్రోవి, బందుకా, బందూ(దు)కు, బుసక్రోవి.

2865. తుపాకిగుండు: గుండు, పడిగల్లు.

2866. తుపాకి చెవి: బాదర, బాదరము, బాదరు.

2867. ఫిరంగి: జబురుజంగి, దంచన, దంచనము, దెంచనము, సురకొలి.

2868. ఫిరంగులవారు: దంధమూలు.

2869. సురేకారము: పెట్లుప్పు, యవక్షారము, యవజము, యవనాళజము, యవలాసము, యవశూకము, యవాపత్యము యవాహ్వము.

2870. ఆయుధవిశేషాలు: అశ్మగుడ, అశ్మగుడము, అరె, అద, ఉండసురియ, ఏనుగుకోల, కంపణము, కొలఁడు, గడిదల, గసాబు, గుంటు, గుమితి, గుద్దుకత్తి, చింగోటి,

చేతాళ్లు, తిక్కటి, త్రికాష్టి, త్రిక్కటి, దండె(డియ), దగరు, దోదుముదారి, దోదుమ్మి, పందికైదువు, పందిపోటు, పందీటి, పలకగొడ్డలి, ప్రాథనికము, బల్లిగట్టు, బాణాకత్తి, యమధాటి, శతఘ్ని, సంబడము, సత్తి, సామంతరాగోల, సిరాణము, సుగాలము.

2871. గెలుపు: అవజయము, అవజితి, గెలువడి, గెలువము, జయము, జా, జే, విజయము, విజితి, సంపత్తి, సంపత్తు, సంప్రసిద్ధి, సంబంధము, సహా, సాధనము, సిద్ధి.

2872. గెలుచు (స.క్రి): అంగవించు, అదుము, గెల్చు, తెరలించు, దంచు, దట్టించు, నిర్జించు, నెగ్గు, నెట్టించు, పఱపు, మక్కించు, మించు, విజయించు, సాధించు.

2873. విజేత: గెలుపుకాడు, జయశీలుడు, జితకాశి, జితవంతుడు, జిత్వరుడు, జిష్ణువు, జేత, పరాజిష్ణువు, విజయి, విజయుడు, సత్త్రి.

2874. బిరుదు: పట్టము, పవాడము, బిరుదము.

2875. బిరుదుచిహ్నములు: గండపెండేరము, బిరుదందె, వీరవట్టము, సింహతలాటము.

2876. బిరుదవిశేషాలు: ఎలదాయరక్కసుడు, ఎలదాయసింహుడు, దొంతిమన్నెవిభాలుడు, ధీరోత్తమగండడు, మూరురాయరగండ.

2877. ఓటమి: అజయము, అపజయము, అభిభవము, ఓట(టు), ఓటము(మి), ఓటు(డు)పాటు, ఓలచెంగనాలు, తోలుపు, పరాజయము, పరిభవము, బన్నము, స్ఖలనము, హోనము, హ్వాల, హ్వాలము.

2878. ఓడించు (స.క్రి): అడగద్రొక్కు, ఆక్రమించు, ఓటాఱుచు, ఓటుపఱుచు, ఓటుపుచ్చు, ఓడజేయు, ఓర్చు, క్రిందుపఱుచు, చెంగగొట్టు, డీలుసేయు, పరాభవించు.

2879. ఓడు (అ.క్రి): ఓటఱు, ఓటిల్లు, ఓటుపడు, ఓటుపోవు, ఓహటించు, కీడుపడు, తేలిపోవు, పరాజితమగు, మసలు, వీగు.

2880. అడగు (అ.క్రి): అడ(ణ)గారు, అణగు, ఇందు, ఇముడు, ఇఱుకు, ఉడుగు, ఉపశమిల్లు, కుదియు, గోడివడు, చల్లారు, డిందు, డిందుపడు, తాఱు, తీలగు, తీలుప(బ)డు, దండసిల్లు, దోకు, పనుపడు, మందటిల్లు, మడు(ణు)గు, మ్రగ్గంబడు, రేకుమడగు, లోగు, శమించు, సగ్గు, సుడియు, స్రగ్గు.

2881. అణచు (స.క్రి): అంటగట్టు, అడంచు, అడగద్రొక్కు, అడగించు, అడచు, అణగించు, అదుము, అవఘలించు, అచు, అను, ఉడిగించు, ఒడుచు, కుదించు, కుదియించు, క్రుక్కు, క్షమియించు, చక్కుచేయు, త్రొక్కు, దమించు, పఱచు, పోకారుచు, మట్టు, మడచు, మణగించు, మలచు, మాటు, మొత్తు, మ్రింగికొను, యమించు, రేకుమణగించు, రేకుమణచు, లొంగదీయు.

2882. పరాజితుడు: అపజయుడు, ఓటరి.

2883. సంధి: అంగీకారము, ఉపసంవాదము, ఒడంబడిక, ఒడబడక, ఒడబాటు, ఒప్పందము, పణబంధము, పిడివాటు, పొందు, బాస, రాజీ, సంప్రతిపత్తి, సంవిద, సంస్థ, సత్యంకారము, సత్యాపనము, స్కంధము.

2884. పలాయనము: ప్రడీనము, ప్రద్రవము, ప్రసరణము, ప్రేతి, ప్లాయనము, భ్రంశము, విద్రావము, వీక, సందావము.

2885. పాఱిపోవు (అ.క్రి): అపక్రమించు, ఉడాయించు, కేడించుకొను, చెదరు, తిరుగబాఱు, పరుగెత్తిపోవు, పఱచు, పారు(ఱు), పెల్లగిల్లు, పోవు, వెన్నిచ్చు, సురుగు.

2886. పారద్రోలు (స.క్రి): ఎగుచు, చోపు, చోపువెట్టు, తఱుము, తూలద్రోలు, తోలాడు, పాఱనొత్తు, రొప్పు, రేచించు, వెన్నుసఱచు, వెళ్లించు.

2887. శరణార్థుడు: అభిపన్నుడు, ఆశ్రితుడు, ఉపజీవకుడు, ఉపజీవి, ప్రపన్నుడు, శ్రితుడు, సంశ్రితుడు.

## 23. వస్తువు, దాని వివిధ స్థితులు

2888. వస్తువు: ఉరువు, క్రయ్యము, క్రేయము, దినుసు(స్సు), పదము, పదార్థము, ప్రతి.

2889. వస్తుసమూహము: పస, బండము, బండాలము, విట్పణ్యము, సంభారము, సరంజాం సామాగ్రి, సామాను.

